లచ్చారాయు, చెలికాని

ఆర్. వి. రామారాయ ఖండనము

చిత్రాడ, 1921

Record no. 217

Laccārāya, Celikāni

Ār. Vi. Rāmārāya khaṇḍanamu

Citrāḍa, 1921

Record no. 217

Bibliographic Record Target

లచ్చారాయ, చెలికాని.

ఆర్. వి. రామారాయ ఖండనము / ఇయ్యది చెలికాని లచ్చారాయప్రకటితము.-
చిత్రాడ : శ్రీరామవిలాసముద్రాక్షరశాల, 1921.

12, (2) p. ;17 cm.

Record no. 217

Laccārāya, Celikāni.

Ār. Vi. Rāmārāya khaṇḍanamu / Iyyadi Celikāni
Laccārāyaprakaṭitamu.- Citrāḍa : Śrīrāmavilāsamudrākṣaraśāla, 1921.

12, (2) p. ;17 cm.

Record no. 217

# ఆర్. వి. రామారాయ ఖండనము.



ఇయ్యది

## శ్రీ చెలికాని లచ్చారాయ ప్రకటితము.

గీ॥ కారణములేని కలహంబు ♦ కరుణలేమి
పరవధూ పరధనవాంఛ ♦ బంధు సాధు
జనములందు ససూయత్వ ♦ మనఁగ జగతి
ప్రకృతిసిద్ధంబు లివి దుష్ట ♦ నికరమునకు॥

(భర్తృహరి.)



చిత్రాడ:
శ్రీరామవిలాసముద్రాక్షరశాల ముద్రితము.
1921.

దీనివెల రు 0—1—0.



వారలమర్యాదలే మనకుఁ బరిష్కృతములు కాఁగలవుగదా!
"శ్రీ చెలికాని లచ్చారావుగారిచే వ్రాయఁబడిన విషయము
లలోఁ గొన్ని పరస్పరవిరుద్ధములు గన్పట్టుచున్నవి" శ్రీలచ్చా
రావుగారు 11వ తేదిని శ్రీరాజావారిని గలసికొన్నప్పుడు "మీ
రు వెలమ సంఘముయొక్క విద్యాభివృద్ధుల విషయమై వెలమ
వారిస్థితిగతులననుసరించి యుచితవేతన భోజనాదివసతులనదు
పాయములొనర్చెదమని సెలవిచ్చినది యెంతవరకు కార్యరూ
పమునఁ బరిణమింపఁజేసితిరి" రనియడిగినారట? దీనినిబట్టిచూ
డఁగా నింతకుఁబూర్వము కొంతకాలముక్రిందట నెప్పుడో శ్రీల
చ్చారావుగారును, శ్రీరాజావారును సమావేశమైనప్పుడు శ్రీ
వారు లచ్చారావుగారితోఁ దాము వెలమసంఘముయొక్క వి
ద్యాభివృద్ధుల విషయమై యుచితవేతన భోజనాదిసదుపాయం
బులొనరించెదమని చెప్పినట్లును, అదియెంతవరకుఁ గార్యరూప
మునకుఁ దెచ్చితిరని యిప్పుడు "శ్రీలచ్చారావుగారడిగినట్లును
స్పష్టమగుచున్నది" అనివ్రాయించిరి.

నేను ఇంతకుఁ బూర్వము శ్రీరాజావారిని సమావేశ
మవకుండ అయినట్లు వ్రాయుట పరస్పరవిరుద్ధమనిగదా! ఈ
పై వెలమనాయుఁడు పద్మనాయక సంఘసభకు రాకపోయినను
(1916 సం॥ అక్టోబరు 30 తేదీ సోమవారము ఆంధ్రపత్రిక)
నుల్లేఖించితిరా? పెక్కుగ్రామములనుండి యానాటి సభకు
వచ్చిన యాబదిమంది వెలమదొరలున్ను తమస్వహస్తములచే
వ్రాల్జేసి అర్జీనొకదానిని తయారుచేసి శ్రీపిఠాపురం రాజా



వారికిఁ గార్యకర్తగా మెలఁగించి సమర్పించువారిలో నన్నొకని
గానియమించిరి. ఆనెల 2వ తేదీని శ్రీప్రభువతంసునిదర్శ
నము సేయు అనిప్రకటించిన పత్రికాప్రకటననుగాంచితిరా? స
మావేశశంక, పరస్పర విరుద్ధమువదలినదా? ఈవ్యాసకర్త వె
లమయయినచో గోదావరిజిల్లా వెలమలందఱికి సంబంధించిన స
భావృత్తాంతము నెఱుంగకుండునా? వ్యాసకర్త నెఱుఁగడుగాని
కృతిభర్త నెఱుఁగును. మఱచిపోయెనేమో! మఱియొకటి "శ్రీరా
జావారు తమకుఁగలిగిన సత్సంకల్పము నుత్తరక్షణముననే య
న్యులచెవినిబడకుండఁ గార్యరూపమునఁ బరిణమింపఁజేయుచుం
డుట యందఱికిని దెలిసినదేగదా? అట్టిస్థితిలో శ్రీవారు తమసం
కల్పమును ముందుగానే శ్రీలచ్చారావుగారితోఁ జెప్పుటయుఁ
గొంతకాలమువరకు దానిని గార్యరూపమునకుఁ దేకుండుటయు
నెట్లుసంభవించును? అను నాఱియొక ప్రశ్న! యెవరికైనను నే
కార్యమునైన సమజేయ సంకల్పముదయించునపుడు చేయఁదలఁ
చినప్పుడు దానిఁ గార్యరూపముగఁ బరిణమింపఁజేయుటకు నేదో
విఘ్నముగఁ దనసంకల్పములను కెఱింగింపకుండఁ గార్యసిద్ధమ
గునా? సంకల్పముగలిగిన గుడ్డెద్దు చేనుబడినట్లుఁ జెప్పుటయా?
మూఁగవానివలెసంకల్పము మనసులోనుంచుకొనివానివలె సం
చరింపవలయు! ఈసంకల్పమును గుఱించియే పెదపవని వెలమ
జమీందారులగు శ్రీరాజాభూపాలభద్రరావుగారు 1911 సం॥రం
లో యిచ్చిన "రాజధర్మము" అనుమహోపన్యాసంబును గనుఁడు.
మనసంకల్పశక్తి నివృద్ధావహచక మనశక్తి కొలఁది సత్కార్యము

ను జేయుటకు నుపయోగింపవలెను. మనదేశసంపద దైన్య
మును దొలగింపఁజేయు విద్యాభ్యాసము మొదలగు దేశాభివృద్ధి
కరములగు పనులఁజేయ నిశ్చయింపవలయును. ఈనిశ్చయము
ననుఁ గార్యములనుగూడఁ జేయవలయును. అట్టికార్యముల
ను జేయనిచో నీసంకల్పశక్తి కార్యముగాఫలింపక వ్యర్థమైనవ
స్సు కృశించును. కార్యముగాఁబరిణమించనట్టి సంకల్పము స్వ
ప్రయోజనమును సోమరితనమును వృద్ధిజేయును. కావునఁ బూ
ర్వము దశరథుఁడు, శ్రీరాముఁడు, హరిశ్చంద్రుఁడు మొదలగు
వారు తమ మనోనిశ్చయమును మేరకు నెఱవేర్చిరి. "మనస్యే
కం వచస్యేకం కర్మణ్యేకం మహాత్మనః" అనునది గ్రహించవల
యుగాక. మనస్సులో నెద్దానిఁదలఁచునో యద్దానినే వాక్కుచేఁ
జెప్పును. వాక్కుచే నెయ్యది చెప్పునో యయ్యది యేకార్యమువ
లనఁ జెల్లఁజేయును. అట్టివాఁడే సత్పురుషుఁడు" అనిగదా!

ఒక భవననిర్మాణమునకు సంకల్పించు సనుకొనుఁడు.
ధనము సంచులాదిగ గ్రుమ్మరించును భవనము వచ్చివ్రాలునా?
పనివాండ్రు రావలదా? పరికరములు తేవలదా? అవకాశము వద్దా?
కావున నా సంకల్పము అనుకూలపడిన బిదప నాత్మరక్షణము
చనే కార్యరూపముగఁ బరిణమింపఁ జేయుట దుర్లభముగదా!
ఎంత మేధావంతుఁడైనను ధనవంతుఁడైనను మహారాజైనను
సంకల్పించి నంతమాత్రమున నుత్తరక్షణమున నెట్లు నెరవేర
గలదు! సృష్టి స్థితిలయకరుఁడగు నొక్క భగవంతునికే నెర
వేఱునని చెప్పఁబడుచున్నది. శ్రీవారిపట్టాభిషేక సమయమున



గారి సంకల్పప్రకారము 5 గంటలకు సభ యేర్పాటు 6 గంట
లాయెను. ఇంతయేల? చిన్నసభయగు దసరాదర్బారుకు 3 గంట
ది 4 గంటలాయెను. (1907 సం॥రం ఆర్యమతబోధిని 1911
సం॥రం కృష్ణాపత్రికలు) గనుఁడు. ఆయుదారగుణుని సంకల్ప
ము మంచిదే. సంకల్పము కలిగినంతమాత్రమున మధ్య విఘ్న
ములు తొందఱుండవచ్చును! సంగతిసందర్భముల నారయక,
మంచిచెడ్డ లాలోచించక ఆయుత్తరక్షణమునందే తానేబుద్ధి
మంతుఁడననే అహంభావ స్వరూపులు గారనియు సంకల్పసిద్ధి
కి తత్సంకల్పసిద్ధి నిర్వాహణోత్సాహులకే గాని తదితరులకు
తెలియపఱచరనియు తెలియునారు గాక. ఇదిగాక యింకను వె
లమ సంఘాభివృద్ధికరమగు సంభాషణ మెంతయో జరిగినది.
వాటి నిచట విస్తరించు టనవసరంబని వదలితి. "గుణీ గుణం వే
త్తి న వేత్తి నిర్గుణో బలీ బలం వేత్తి న వేత్తి నిర్బలః। పికో వసంతస్య
గుణాన్ న వాయసః కరీచ సింహస్య బలం న మూషకః॥"—
గుణముగలవాఁడు గుణము నెఱుంగును. గుణహీనుఁ డెఱుఁగడు.
వసంతఋతువుయొక్క గుణమును కోయిల యెఱుగునుగాని కాకి
యెఱుఁగదు. సింహములయొక్క బలమును ఏనుగ యెఱుగునుగాని
ఎలుక యెఱుఁగదుగదా! శ్రీరాజావారు సుమారు 5, 6 సంవ
త్సరములనుండి యు పీఠికాపురమున యించుమించుగా 25 బీదల
వెలమవిద్యార్థులకు ప్రత్యేకము నుచితవేతనభోజనాది సదు
పాయములొనర్చి వెలమసంఘాభివృద్ధికిఁ దగిన సహాయములఁ
జేయుచునేయున్నారుగదా! అట్టియెడ శ్రీలచ్చారావుగారు శ్రీవా

రినిప్పుడిట్లు క్రొత్తగా నేలయడిగెదీ. పీఠికాపురమున కత్యంత
సమీపముననున్న చిత్రాడయందు నివసించునట్టియు శ్రీవా
రిబంధువర్గములో జేరినట్టియు శ్రీలచ్చారావుగారికి పై సంగతి
తెలియక యట్లడిగియుండురా! యని మరియొక ప్రశ్న దీనివల్ల
నీయన వెలమకానట్లు స్పష్టమగుచున్నది.

నాకు తెలియక క్రొత్తగా ప్రశ్నించి యుండవచ్చును.
4 సం॥రముల క్రిందట జరిగినగోదావరిజిల్లా పద్మనాయకసంఘ
ము సభ చిత్తగించితిరా? "విద్యావిషయములవెనుకబడియున్న
వెలమవారికి భోజనాదిసదుపాయములొసర్చి వేతనాదులుచితరీతి
నొసంగి విద్యాభివృద్ధి నొసంగజేయుటకు శ్రీపిఠాపురంరాజావా
రిని కోరుటయు ఆనాటి సభావృత్తాంతము, పెక్కుగ్రామంబుల
నుండి ఆనాటిసభకువచ్చిన యావన్మందిదొరలున్ను తమస్వహ
స్తంబులచేవ్రాల్లుచేసి "అర్జినొకదానిని తయారుచేసి" (పద్మ
నాయకసంఘము 1916 సం॥ అక్టోబరు 30 తేదీ) ఆంధ్రదినప
త్రికచూచితిరా. నాకు తెలియక క్రొత్తగా అడిగి యుండవ
చ్చును. ఒకడా, యిద్దరా! పెక్కుగ్రామంబులనుండివచ్చి పె
క్కుమందిసభ చేసి అర్జీయిచ్చిరే, వారికిని తెలియదందురా.
అకనుచితవేతన భోజనాది సదుపాయములనందు వారెవరు?
శ్రీరాజావారి భావమరది మొదలుగాగల బంధువర్గములోని వా
రా? కారే, వారున్ను చేవ్రాల్లుచేసిరి. ఇక నెవరు? పేదలగు
నువారవు దొరలనబడువారా, కాదే, వారు 5, 6 సంవత్సర
ములనుండి యున్నవారుకారు. చిరకాలమునుండి భుజించుచు



న్నవారే, వారికి ఉచితవేతనములు ఈయవలెననియు చదవు
కొనుటకు రాలె అందుభుజించవలెనని యేర్పాటులేదే. ఇంక నెవరి
నియాయన చూచినారో పరగ్రామవాసినగు నాకు తెలియక
పోయినదని అధిక్షేపించిన మీరైన ఉపదేశకర్తల మీగురు
స్వాములవారినైన అడిగి తెలిసికొని గ్రహించినదేది! గుట్టు
వెల్లడియైపోవుటయేనా, "శ్రీరాజావారుచేయుచున్న సహాయ
ము తమదృష్టికొకలెక్కగా దోచకుండుటచే నట్లడిగి యుం
దురా", యనిప్రశ్న మీకెట్లుదోచినను విద్యాదానాది విష
యంబె విశేషధనమును గుమ్మరించుచు దానప్రియుడనిను
ప్రసిద్ధిని వడయుచున్న శ్రీరాజావారు స్వసంఘమునందు 25గు
రువెలమవిద్యార్థుల కుచితవేతన భోజనాది సదుపాయములొస
ర్చుచున్నారన నాదృష్టికేగాదు లోకమునకుగూడ లెక్కగా
దోచదు. వెలమసంఘముయొక్క యభివృద్ధి విషయమై సహా
యము చేయుటకు శ్రీరాజావారిని దాము ప్రోత్సాహము చే
యుచున్నట్లు లోకమునకు వెల్లడిచేయుటయే నాప్రకటన."
అట్టి గొప్పకార్యములలో శ్రీమంతుల ప్రోత్సాహపరచుట
లాభకరముగాని అర్థశూన్యులగు మిమ్ము మిమ్ము ప్రోత్సా
హపరచుట గొంతుకనొప్పివ్యథా ప్రయాసమేగాని సార్థకము
లేదుగదా! నేను వెలమసంఘముయొక్క అభివృద్ధివిషయమై స
హాయముసేయుటకు శ్రీవారిని ప్రోత్సాహముసేయుట లోకము
నకు వెల్లడియగుటకు ప్రకటనసేయవలసి ఉండునో వలదో
చదువరులే గ్రహింతురుగాక. "పెక్కుగ్రామంబులనుండి ఆనా

టినసభకువచ్చిన యావన్మంది వెలమదొరలున్ను సమస్తమా
స్తంభములచే వ్రాళ్లుచేసి అర్జీనొకదానిని తయారుచేసి శ్రీరా
జావారికి కార్యక్రమమెఱింగించి సమర్పించువారిలో నన్నొక
నిగా నియమించిరి. అప్పుడు కతిపయదినంబులకన్న శ్రీవారు
మకాములోనుంతమింజేసియు ... ... వెంటనే దెలుపవలను
గాదయ్యె. పట్టణమకామునకు వృత్తాంతము నివేదించుచువి
ద్యాదాన శ్రీమ్మాన్వీమును దెలిపియుంటిని. ఈలోపున నాసభా
పర్యవసాన మేమయినదని కొవ్వాడ, గోరస, కొత్తపల్లి,
మొదలగు గ్రామములవారు మిగులయాతృతతో నన్నడుగుచు
ముత్తరములు వ్రాయుచుండిరి. ఈనెల 23వ తేదీని ప్రభువతం
నని దర్శనముచేయు కొలందికాలములోనే మనకార్యముసాను
కూలము చేయునట్లు సూచనజేసిరి."(నళ సం॥ర కార్తీక శు4సో
మవారము ఆంధ్రదినపత్రిక.) ఇంక ప్రోత్సాహము పరచవచ్చు
నా! ఈ వార్త లోకమునకు వెల్లడిచేయవలయునా! వలదా ఇం
టింటికిఉత్తరము వ్రాయవలయునా! "కొందఱు వెలమవారు
అర్జీలిచ్చికొన్నప్పుడు వానినవములోనికి తీసుకురాలేదని విం
టిని. ఎంతవఱకునిజముని అడిగినారట" ప్రస్తుతము 40కన్న
ఎక్కువయుండుటకు గృహములేకుండుటయు అర్జీలు నిర్ణీతకా
లకు అతిక్రమించివచ్చుటచే తిరస్కృతమై యుండవచ్చునని
శ్రీవారి ప్రత్యుత్తరము సరియైనదనుగావచ్చునట కాని శ్రీవారు వె
లమవారికి క్రమముగా ప్రత్యేకపు హాస్టల్ ఏర్పరుచునట్లు
సెలవిచ్చుటయు ...... మిక్కిలివిరుద్ధముగా గన్పట్టుచున్నది.



లిసినవి విరుద్ధములట. ఈనిగుణ ప్రకారము యిదివరకే జరుగు
చున్నవట ఏవిధమన. "శ్రీరాజావారు వెలమవారికి ప్రత్యేక
హాస్టల్ ఇదివరకే ఏర్పరచియుండిరిగదా పరీక్షలలో బాగుగా
కృతార్థులయిన వారల నితరస్థలములకు వివిధపరీక్షలకై పంపు
టలేదా. సంస్థానము ఖాళీయయిన యుద్యోగములకు వచ్చుదర
ఖాస్తులలో వెలమవారిదరఖాస్తులకే మొదటమేలునొసంగు
చుండుటలేదా. తెలివితేటలతో న్యాయముగా పనిచేయువారికి
ప్రమోషన్ చేయించుటలేదా. ఇవన్నియు నింతకు పూర్వమే
కొన్ని సం॥రముల క్రిందటనుండియు జరుగుచుండగా శ్రీవారి
వికొత్తగాజరిగించునట్లు ఏలసెలవిత్తురు." అని యిదిపరస్పర
విరుద్ధములని సందేహములని వ్రాయుచున్నారు. కలమెట్టు
లాడిన నటుల వ్రాయుటయేనా చిక్కువచ్చినట్లల్ల నస్త్రత్తు
నివలెప్రశ్నప్రలాపములు చేయుటయేనా మాఅర్జీయొక్క పూ
ర్వము వెలమవిద్యార్థులకు శ్రీరాజావారు ప్రత్యేకపు హాస్ట
లు యేర్పరచినట్లు తమరు ఋజువుచేయగలరా సంస్థానము న
ఖాళీయయిన యుద్యోగములకు వచ్చుదరఖాస్తులలో వెలమ
వారికే మొదటిమేలు నొసంగుచున్నట్లు ఇదివరకు మీరువిని
యున్నారా. మా అర్జీ పూర్వమొతిమంది యుద్యోగములం
దుండిరో యొకవెలమయువకుని వ్రాయగలరు. "వెలమవిద్యా
భివృద్ధిగోరి వర్ణమునందలి విద్యాభివృద్ధికొఱకు ప్రయత్నించిన
వారిలో శ్రీపిఠాపురంరాజావారు మొదటకొందఱను సర్వులకు
తెల్లరకువిశదమే. కానివారిపోషణవర్గములో విద్యనభ్యసించి

యితరసంస్థానములలో నుద్యోగము జేయుట కడుహాస్యాస్పదముగనున్నది.

శ్రీవారు తాము విద్య చెప్పించినవారికి తమసంస్థానంబులోనే యుద్యోగమిప్పించినయెడల సువర్ణాక్షరములవలె నుండును. గావునట్లు చేయుటకు ప్రార్థించుచున్నాడ.., (1917వ సం॥ రం జనవరి ఆంధ్రదినపత్రిక) పర్యవసానమేమి "శ్రీలచ్చారావుగారడిగినట్లు స్పష్టమగుచున్నది. సంభవించునుగాక శ్రీరాజావారిచ్చిన ప్రత్యుత్తరముసరియైనను గావచ్చును." అను యిత్యాదివాక్యంబులచే దృఢపరచుకొన్నవారికి మరలవిరుద్ధములు, సందేహము లేలకో, ఇకసందేహముదొరకక యివియన్నియు బాగుగానేయున్నవి గాని నీవుగాకపోతే నీపెద్దలుతిట్టిరన్న తోడేలుకథవలె మరియొక అసందర్భపుగాథకు దిగిరి. ఇట్లుండగా శ్రీలచ్చారావుగారు 7 మాసములక్రిందట కృష్ణాపత్రికలో వ్రాసినవ్యాసమునందలి కొన్నిపదములంత వినయగౌరవసూచకముగా గన్పట్టుచుండుట లేదు కలుసుకొంటిననియు, అమలులోనికి తీసుకురాలేదని వింటిని. ఎం వరకునిజమని అడిగితిననియు, అనునవి శ్రీవారికి అగౌరవములట ఇద్దటవిమర్శించవలసిన విషయమేది.

చదువరులారా! పైవ్యాసంబునకును ఈపదములకును లంకెవేయుటకు ఏమైనసందర్భమున్నదా? ఇంతకన్న వినయగౌరవసూచకములైన దర్శించితిని మొదలగుపదము లుపయోగించిన తెన్నగాయుండునని వ్రాసి నిజముకు అమలులోనికి అర్థ



ములు వ్రాయరైరి. ఇది గ్రామ్యక నేను ప్రయోగించుపదము కాదనియు గౌరవార్థముగా పెద్దలయెడ వెలమవారియెడను పయోగించుచున్న పదమనియు నీదిగువసంగతులంబట్టి గ్రహింతురుగాక వాల్తేరులో జరిగిన వెలమజమీందారీ వివాహానందర్భమును [కృష్ణాపత్రిక 1914సం॥ రం అగష్టు] తిలకింతురుగాక "ఈవివాహమునకు తేలప్రోలుజమీందారధ్యక్షులు (పెండ్లిపెద్ద) గానుండి......కొన్నికారణాంతరములచే సుముహూర్తపువేళకు రాలేకపోయెనుగాని......నగరు పెండ్లిరోజున......స్టేషనుకు జేరెను. పెండ్లికుమారునితండ్రియు, పెండ్లికుమార్తె రెండవసోదరుడును మోటారుమీద స్టేషనుజేరి వారిని కలుసుకొని మాటలాడి మోటారునెక్కించుకొని" అనిమర్యాద జేయునప్పుడుపయోగించినదేనా! ఇందధ్యక్షుల [పెండ్లిపెద్ద] గువారిని కలుసుకొనుట అనునది యగౌరవము కాదుగనా! మఱియు "శ్రీరాజచక్రవర్తిగారు.....జిక్నాషోరి చేరినారు. సర్ చంద్రసుంషరుజంగు గారెదురుగంబోయి మోటారుబండిలో గలసి" [కృష్ణాపత్రిక 1911 సం॥] యని యున్నది గదా! అంతటిచక్రవర్తిని, దేశాధీశుని కలసుకొనుటయేటి! ఇటులనెన్నియో గలవు. వెలమవారియెడ చక్రవర్తులయెడలనుగూడ నుపయోగమగుచున్న పదము లేగదా. ఇక నిఘంటువుల పరిశీలించినను కలసికొనుట దర్శించుట (Meeting) పర్యాయపదములు నొప్పుచున్నవి. ఇంతయేల తుదకు యిన్ని వంకర్లుతిరిగి తమరుతీసినగోతిలో తమరే బడ్డటు తమరే "శ్రీ

లచ్చారావుగారు 11వ తేదీని శ్రీరాజావారిని కలసికొన్నప్పుడు" అనివార్యనీచవంచనవ్యాపారులై రే! అన్నియు దెలసియు వాని కృతమాహాత్మ్యమరణము ఏమిదెలియనివానికి ఏకాదశీమరణమ న్నట్లు ఇన్నియు దెలిపి తుదకు తమరే కలసుకొన్నప్పుడు లచ్చారావుగారితో జెప్పిరి. శ్రీవారినిప్పుడిట్లు నేలయుడిగిరి అను మాటుపదముల ప్రయోగించుటకు మనస్సెట్లొప్పెనో! గిల్లుచుండి ఊపినట్లుండునవతి తల్లి ప్రేమగల ఈలేఖరి శ్రీరాజావారిని వెనుక వేసుకొనినట్లుండవలె కపటనటనల కలహాము పెంచుచుండవలె. ఇవిగదా ధూర్త లక్షణము. గోముఖ వ్యాఘ్రము. "ముఖం పద్మదళాకారమ్ వచశ్చందనశీతలమ్। హృదయం కర్తరిసమం చాతి వినయం ధూర్తలక్షణం॥" అనునదిచ్చట గమనించదగినది. పత్రికాధిపా! హితకారిణీ! ఇట్టివేషధారులఆనామధేయుల వ్రాతలకు భ్రమించి లోబడక లోకమునక క్కరవచ్చు ప్రమర్శనంబులకే తావొసంగి పత్రికానామంబు నుసార్థకంబునకు దెచ్చి వర్ధిల్లెదవుగాకయని గోరుచు ఈవిమర్శనంబు నింతటితో ముగించుచున్నాడ.

చిత్రాడ
15-6-20 }

ఇట్లు,
చెలికాని లచ్చారావు.

---

నోటు:—హితకారిణిపత్రికకు, పంపుట మైనది.

# అముద్రితాంధ్రగ్రంథసర్వస్వము.

చెలికాని లచ్చారావుగారు,
(సంపాదకులు.)

1. జాహ్నవీమాహాత్మ్యము (ఏనుగు లక్ష్మణకవి) 0-10-0
2. సీమంతినీకళ్యాణము (పెనుమళ్ళ సోమన్నకవి) 0-10-0
3. విజయనందనవిలాసము (మంగళగిరి ఆనందకవి) 0-10-0
4. వాల్మీకిచరిత్రము (రఘునాథ భూపాలుడు) 0- 8-0
5. రంగనాథరామాయణము (కాచభూపతి, విఠ్ఠలరాజు) 1 0-0
6. శ్రీరంగమాహాత్మ్యము (కట్టా వరదరాజేంద్రకవి) 1- 8-0
7. సారంగధరచరిత్రము (కూచిమంచి తిమ్మకవి) 0-12-0
8 మదనగోపాలశతకము. 0- 2-0
9. మహిజామనోహరశతకము. 0- 2-0
10. వేంకటాచలనిలయశతకము. 0- 1-0
11. నమశ్శివాయశతకము. 0- 1-0
12. చిత్రాడవేంకటేశ్వరశతకము (సంస్కృతము) 0- 2-0

వలయువారు, కారదర్శి:
అముద్రితాంధ్రగ్రంథసర్వస్వము
చిత్రాడ; పిఠాపురంపోష్టు, గోదావరిజిల్లా.

# శ్రీ రామవిలాసగ్రంథమాలిక

—♦ నవలలు. ♦—

| | | |
|---|---|---|
| ప్రభాతము. | ... | రు 1—0—0 |
| 2. వినోదిని (ప్రథమభాగ) | ... | 0—12—0 |
| 3. వినోదిని (రెండవభాగ) | ... | 0—12—0 |
| 4. ప్రేమలత. | ... | 0—8—0 |
| 5. పరుసవేది. | ... | 0—8—0 |
| 6. మయసభ | ... | 0—10—0 |
| 7. అపూర్వప్రతిభ. | ... | 0—1 —0 |
| 8. కాంచనమాల. | ... | 0—3—0 |
| 9. రోహిణి. | ... | 0—3—0 |
| 10. రత్నపురి. | ... | 0—2—0 |
| 11. మాయ. | ... | 0—6—0 |
| 12. చాందసుల్తాన. | ... | 0—10—0 |
| 13. పాణిగ్రహణము. | ... | 0—1—0 |
| 14. సహృదయ. | ... | 0—4—0 |
| 15. చినరంగరావు | ... | 0—6—0 |
| 16. హాస్యచరిత్రము | ... | 0—8—0 |
| 17. దోమాడయుద్ధము | ... | 0—13—0 |
| 18. తాతాజీవితము | ... | 1—0—0 |

—♦ ఇతరగ్రంథములు. ♦—

| | | |
|---|---|---|
| 19. బద్దెనీతులు. | ... | 0—4—0 |
| 20. శ్రీనీతిపద్యరత్నావళి | ... | 0—4—0 |
| 21. రాయలరాజనీతి. | ... | 0—4—0 |
| 22. ఐరోపామహాసంగ్రామము | ... | 0—3—0 |
| 23. గోహా. | ... | 0—8—0 |
| 25. ఆంధ్రపరిశోధకమహామండలిప్రకటిత ముద్రితాముద్రితగ్రంథములపట్టిక. | | 0—8—0 |

[illegible], మానేజరు;— శ్రీ రామవిలాస ప్రెస్.

